## ఓరుగల్లు జిల్లా ఆంధ్రజన సంఘము

మహబూబాబాదులో తేది ౧-౨-౩-౧౩౫౦ ఫస్లి నాడు పైసంఘ కార్యకారిణీసభ సమావేశమై క్రిందితీర్మానముల నామోదించెను.—

జిల్లాసంఘమునకు నిధి సమకూరలేదు కావున ఆంధ్రమహాసభాధ్యక్షుల పర్యటన సందర్భమున ఆయా తాలూకాసంఘములే వ్యయముల భరించి యున్నవి గాన పాల్వంచ తాలూకావారు అదే సందర్భమున ఇచ్చిన ముప్పదిరూపాయిలు అచటి పర్యటనమునకై వ్యయమైనవి కావున ఆతాలూకా సంఘమువారు అన్ని సంఘములతో బాటు చెల్లించుటకు కోరబడిన రు౧౦౦|౦ వేరె చెల్లించవలసియుండురని తీర్మానించబడుచున్నది.

ఆంధ్రమహాసభాధ్యక్షుని పర్యటనసందర్భమున ఆయాప్రదేశములందు సభ ఎంపబడిన విజ్ఞప్తుల ను అనుసరించి తగుచర్యజరిపి త్వరలో పర్యవసానము తెల్పుటకు స్థాయిసంఘమువారిని ప్రార్థింపవలెను.

ఆంధ్రమహాసభాధ్యక్షుల పర్యటనసందర్భమున స్థాపింపబడిన క్రింది తాలూకా సంఘములకు జిల్లాసంఘముపక్షమున కృతజ్ఞతలందుకొనుటకు తీర్మానింపనైనది:—

(౧) పాఖాల (స్థాపితము ౨౫-౧-౧౩౫౦ ఫ)
(౨) ములుగు „ ౨౬-౧-౧౩౫౦ ఫ.
(౩) ఇల్లెందు „ ౨౮-౧-౧౩౫౦ ఫ.

ప్రతి తాలూకాసంఘము కనీసము వేయిమంది సభ్యులను చేర్చుటకును, మాస నివేదికలు క్రమముగా జిల్లాసంఘమునకు పంపుటకును (ప్రతి ఉర్దూనెల ౫వతేదిలోగా) తాలూకా సంఘములు తమ ఆదాయమునుండి సగము జిల్లాసంఘమునకు పంపుటకుగాను, తాలూకాసంఘములన్నియు క్రమపద్ధతిని జిల్లాసంఘముతో జతపర్చుకొనుటకును కోరబడునటుల తీర్మానించబడినది.

ఓరుగల్లుజిల్లా ప్రసమాంధ్ర మహాసభాహ్వాన సంఘమునకు ప్రథమ ప్రయత్నమైనను తగువిరాళములరాబట్టుకొని సభను జయప్రదముగా జరిపినందుకు జిల్లాసంఘముపక్షమున కృతజ్ఞత తెలంపుకొనవలెను.

ఓరుగల్లుజిల్లా ద్వితీయాంధ్రమహాసభను మహబూబాబాదు తాలూకాలో జరుప నుద్దేశించి మహబూబాబాదు ప్రముఖులు ఆహ్వాన సంఘము నేర్పరచి జిల్లా సంఘమునకు తెలిపియున్నారు. వారి యాహ్వానమును ననుసరించి మహబూబాబాదు తాలూకాలో జిల్లామహాసభ జరుపుటకు అనుమతిని తెలుపుతూ త్వరలో స్థలనిర్ణయముచేసి తెలుపుటకు ఈసభవారు ఆహ్వాన సంఘమువారిని కోరుచున్నారు.

అధ్యక్షులఎన్నిక అన్ని తాలూకాసంఘములు, పురసంఘ, ఆహ్వానసంఘముల అభిప్రాయానుసారము జరుగవలసియున్నది. కావున నేడు సమావేశమైన సభ్యుల క్రిందిపేర్లు అధ్యక్షపదవికి సూచించుచున్నారు. కాని తాలూకా, పుర ఆహ్వానసంఘముల అభిప్రాయములను త్వరలో జిల్లాసంఘమునకు తెలియపరచుటకుగాను ఆయా సంఘములు కోరబడుచున్నవి. (౨౫) బహమన్ ౧౩౫౦ఫ. లోగా సమాధానము రావలెను

౧. శ్రీయుత మాదిరాజు రామకోటేశ్వర రావుగారు, ౨. పర్చా రంగరావుగారు.

బాధ్యతగల ఆంధ్రోద్యమ కార్యకర్తలు తమ శక్తిసామర్థ్యములను ఆంధ్రోద్యమవ్యాప్తికై కేంద్రీకరించుటకు కోరబడుచున్నారు.

అష్టమాంధ్ర మహాసభాహ్వాన ప్రయత్నముల చురుకుగా చేయుటకు ఓరుగల్లుపుర తాలూకా సంఘమువారు హెచ్చరింపబడుచున్నారు.

నేటిసభ నాహ్వానించిన మహబూబాబాదు తాలూకాసంఘమువారికి ఆతిథ్యమిచ్చిన శ్రీకొమరగిరి వేంకటేశ్వరరావుగారికి కృతజ్ఞతలు సమర్పించుచు సభ ముగించనైనది.

ఇట్లు
ఆవంచ వేంకటరావు
కార్యదర్శి.

—

### ఆత్మహత్య

జిల్లాకరీంనగరం, తాలూకా జగిత్యాలమహాల్ ఎర్రిమములపల్లిలో రెడ్డి పెద్దలకాలు అనే అతనిభార్య నర్సమ్మ అనేపేరుగల ఆమెశరీరం మంటల తెరోగమునకు తాళలేక ౧౬ ఆజూర్ ౧౩౫౦ఫ గురువారము యీవూరికి వాయవ్యమునవున్న కస్తూరిదుబ్బరాజం అనెఅతని చేదూనుబావిలోపడి మరణించెను. అదేరోజు మొకద్దంలో త్యాలిఅయిన గొల్లరామయ్యగారు రిపోర్టు యీవూరికి ఠాణాఅయిన ధర్మపురికిపంపించినారు మరునాడు ౧౨ ఆజూర్ ౧౩౫౦ ఫ. శుక్రవారం పదిగంటలకు పోలీసుమొహరిర్ గారు వచ్చి పంచనామాచేసి వ్రాసుకొనిపోయినారు.

—

## యెల్లారెడ్డి

### తాలూకాదారురాక

(౭-౨)

౧౧ బహమన్ న ౧౩౫౦ ఫ వాల్గు గం టలకు ఇక్కడికి మెదకుజిల్లా తాలూకదారుగారువచ్చి గ్రామప్రజలను సమావేశపరచి స్థానికత హశీలుదారు మరియు మహమ్మదు మహసర్ వకీలు మరియు పోదిరిపంతులుగార్లు యుద్ధము ఎందుకుజరుగుచున్నదియో కానిపూర్తివివరములతో ధపరచు మన బ్రిటిషువారికి జయముకల్గుటకై ఎల్లప్పుడు మనముకోరవలెనని అట్టిదానికి మనము సర్వశక్తులతో సహాయపడవలెనని ఉపన్యాసములు సలిపిరి. మరియు వకీలుగారు గ్రామవ్యవహారవృద్ధి మరియు రాజబాటలు విశాలపరుచుటకై శ్రద్ధతో తాలూకా బాసుసాహెబుగారికి మనవిచెసికొనిరి వారుకూడా హుకుము జారీచేయించగలవనిచెప్పిరి

—

## కష్టహస్తలు

### హిందూహాస్టలుగామార్చవలెను

ప్రస్తుతము ఖమ్మంహైస్కూలునందు చదువుకొనువిద్యార్థులలో చాలాభాగము పరగ్రామముల నుండివచ్చి చదువుకొనువారె, ఈ గ్రామమందు వసతులుచాలినంతగాలేనందున హిందూవిద్యార్థులవేసట చాలాయిబ్బందులు పడుచున్నారు.

కమ్మహాస్టలుపరిపాలకవర్గమువారికి పోయిన సంవత్సరము ఒకదరఖాస్తుద్వారామనవిచేసుకొనియున్నారు గాన యిప్పటికైనను వారుదయయుంచి, హిందూహాస్టలుఅని పేరుమార్చుచు బ్రాహ్మణ, వైశ్య క్షత్రియాదివర్గములవారికిగూడా వసతులుకల్పించుటకు ప్రయత్నం చేయగలందులకు ప్రార్థన.

ఇట్లు,
ఖమ్మం
దిll౧౫-౧-౨-౫౦. } యస్. పాపారావు.

—

## మిరియాలగూడెము

### వైశ్యవర్తకసంఘముదుస్థితి—ధర్మాదాయం జల్సాలకేనా?

వైశ్యవర్తకసంఘాధ్యక్షులగు శ్రీ చిల్లమచర్ల వెంకటప్పయ్యగారు పరమపదించినవలన ఇచ్చటివైశ్యులునూతనఅధ్యక్షుని నెన్నుకొనక వాగ్వాదించెకొట పాడించెపాటవలెనున్నది. వైశ్యవర్తకసంఘమువారి ఏర్పాటుప్రకారము ఏగుమతి దిగుమతిసరుకులపైన ధర్మాదాయము కొన్నిసంవత్సరములనుంచి వసూలుచేయుచున్నారు. సంవత్సరమునకు దాదాపు వెయ్యిరూపాయిలకుపైన వసూలుఅవుచున్నది. యింతవరకు ఏదాయసంస్థనైనను నిల్వలేదు ఇంతపెద్దమొత్తము వసూలుచేయుచేమి యింతహీనముగా నిలువవుంచుచేమని కొందరికిఆశ్చర్యముగలుగకమానదు. మరియు యిట్టిదాయమునుంచి కొందరుపెద్దలుకూడి పోలీసులకని రంజానుపండుగఇనాములు, ఎవరైన అఫీసరు తబాదిలాఅయితే కేటప్పుడు. వారికివిందుకొరకు వచ్చిఎవరైనఅడిగినచో యీపెద్దలు ధర్మాదాయమునుంచి దయయిచ్చుచున్నారు యితరుల గ్రామజనులనుంచి ధర్మఖర్చువసూలుచేసి యీవిధముగాఖర్చుచేయుట చాలావింతగానున్నది కావున యిప్పటినుంచియైనను పైవిధము గాఖర్చుచేయక ధర్మఖర్చుఅన్నఅర్థమునకుచెందుతుందో నిష్పక్షపాతముగా ఆలోచించి ధర్మాదాయధర్మలకొరకు వినియోగించగలరని కోరుచున్నాను.

ఇట్లు,
శింగిరి కొండలచ్చయ్య
౧-౨-౩-౫౦ ఫ.

—

## సదాశివపేట

(ఒ. వి.)

౨౭-౧౦-౪౦నాటి గోలకొండ పత్రికలో ప్లేగుటీకాలనిర్బంధము విషయములోనొకవార్త ప్రకటింపబడియుండెను. అందు మెదకుజిల్లా దొరాడాక్టరుఒకవర్తకుని పోలీసువారికప్పించినవార్త వ్రాయబడెను దొరాడాక్టర్ అనుటలో అపోహకుతావిచ్చినది. సంగారెడ్డిలోనుండినట్టి డాక్టరుగారికి దొరా డాక్టరందురు. కాని పైన్నెగుటీకావార్తలో తెలుపబడిన డాక్టరుగారు పేల్లు యిస్పెక్టరుహోదాకలవారు. వారుదొరా డాక్టరు కారుఅనిస్పష్టము. అందుచేత ఈసవరణ ప్రకటింపవలసినది

—

## ఖమ్మం

### హైస్కూలు విద్యార్థులసమ్మె

(ఒకవిలేఖరి)

బహమన్ ౫వతేది ఆదివారమున కొందరు విద్యార్థులు తరగతిలో ఏదోఒకగంటయందు లేరను కారణముచే హైస్కూలు హెడ్ మాస్టరుగారు సుమారు ౧౬ మంది విద్యార్థులపేరులనుకొట్టివేసినారట అందుపైమరుసటిదినమున హిందూ ముస్లిం విద్యార్థులందరును పాఠశాలకుపోకుండసమ్మెజేసిరి మరియు అమరునమున తమకోరికల నొకఅప్లికేషన్ పూర్వకముగామనవిచేసుకొనిరట, ప్రత్యుత్తరమేమియు చెప్పలేదు గాని వరుసగాఁమూడా సమ్మె జరిగినది

ఈ ప్రకారముదు జిల్లాటోర్నమెంట్సు ౯వ బహమన్ నుండి జరుగుచుండుటచే ౯వ బహమన్ నుండి పాఠశాలలకు సెల్లుమండిరని తెలియుచున్నది.

—

## ప్రకటించబడని వ్రాతలు

ఈక్రింది విషయములనుగూర్చి మాకుచేరియున్న వ్రాతలను ప్రకటింపజాలనందుకు విచారపడుచున్నాము:—

౧ శ్రీశైలమహాక్షేత్రం.
౨. "వక్కి కోమలవాణి యీ దివ్యవాణి" (పద్యాలు)
౩. దత్తాత్రేయజయంతి (ఇందేమియు విశేషం లేదు)
౪. తమాలాఫీసు నిర్ణయం (ఇందులో ఎట్టివిశేషముగానిలేదు)
౫. యువతీవివాహవిషయ పర్యాలోచనము.
౬. కరీంనగరం తహశీలకచ్చేరీలో దౌర్జన్యము.
౭. కారుపాను జాగీరు ప్రజలదురవస్థ (అన్నియు వ్రేలిముద్రలే)

—

# అమెరిగారివిమర్శనలో జాతీయత

## డాక్టరు పట్టాభిగారి వ్యాఖ్య

ఇటీవల ఇండియా సెక్రెటరీ ఆఫ్ స్టేట్ అగు అమెరీగారు లండనులో ఒకవిందులో డిసంబరు ౧౨వ తేదీన ఉపన్యసించుచు ఇప్పటిస్థితిలో భారతదేశమందు ప్రతితెగవారును ముందుభారతదేశము ప్రధానమనియు, తరువాత తమతమతెగలు ప్రధానమనియు భావించవలెనని యుపదేశించిరి. ఈ యుపదేశమును గురించి డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు "హిందూ" పత్రికవిలేఖరికి ఈక్రిందిఅభిప్రాయమును ఇచ్చినారు. అమెరీగారికి భారతదేశసమస్య సంపూర్ణముగా గోచరమైనది. భారతదేశమువంతయు అఖండముగనుండవలెను. అట్లు చేయుటవల్ల ఈసమస్య సులువుగ విడిపోవుటకు వీలుకలిగినది. ఇదే "భారతదేశము మొదట ప్రధాన"మని వారుచెప్పినదానిఅర్థము, కాంగ్రెసుకూడ ఎల్లప్పుడును ఇదేఆదర్శమును దేశమునకు ప్రకాశముగనుండునట్లు తెలుపుచున్నది.

"అమెరీగారు 'సంపూర్ణస్వాతంత్ర్యము, సంపూర్ణవికాసము, వ్యక్తిజీవితముల నానాప్రకారత్వము' చెడకుండఉండునట్టి వ్యవస్థతోపాటు భారతదేశము, బ్రిటనుకలిసియుండుట కావలెనని కోరుచున్నారు. కామన్వెల్తుఅనేపేరుపెట్టినంతను బ్రిటిషుసామ్రాజ్యమును ఉంచవలెనని అమెరీగారు కోరుచున్నచో, భారతదేశము వారిమాటకు ఏమాత్రముసమ్మతించదు. ఇందుకు కారణము ఏదైనపెద్దకామన్వెల్తులో చేరవలెననుఇష్టము భారతదేశానికిలేకుండుటకాదు. ఆకామన్వెల్తు బ్రిటిషువారిదే యుండవలెననిఏమి? బ్రిటను భారతదేశము, ఇంకాకావలసినచో అమెరికా సంయుక్తరాష్ట్రములుకలిసి క్రొత్తగా ఒడంబడికలనేర్పరచుకొని వాటికిబద్ధములైఉండే కామన్వెల్తుకావచ్చును. ప్రపంచమునకంతటికిని కలిసి ఏర్పరచే ఫెడరేషనుమాటఅట్లుంచి బ్రిటిషుకామన్వెల్తుతో వేరేగాచేరువిషయంలోమాకు ఆక్షేపణలేదు. కానిమేముస్వతంత్రులముగా తిరిగాచేరి క్రొత్తఒడంబడిక ఏర్పాటుచేసికొనవలెననిమామాట. అంతేగాని ఇప్పటివలె భారతదేశము సమానభాగస్వామిగాక అస్వతంత్రమైయుండేపద్ధతిమీదనే భవిష్యత్సంబంధములుకూడ సాగవలెననేమాటకు మేముఎంతమాత్రము సమ్మతించము.

"కాంగ్రెసువారు, ముస్లింలీగువారు, భారతప్రభుత్వము భారతజాతీయతను పోషించవలెనని కోరినదాని విషయంలోమట్టుకు అమెరీమాటను ఆక్షేపించుటకు అవకాశములేదు. ప్రథమముగా భారతదేశంలో భాగస్వాములును, భాగస్వాములుగాఉండక తప్పనివారునుఅగు సోదరముసల్మానులను తమపక్షమునకు చేర్చుకొనుట కాంగ్రెసుగారివిధియనుట నిస్సంశయము. అధ్యక్షకారకమే భారతజాతీయకాంగ్రెసుమహాసభకు నేడు ముసల్మాను అధ్యక్షుడున్నాడు, మరియు అఖిలభారత కాంగ్రెసుపరిషత్తుయొక్క కార్యాంగమందు నలుగురుముసల్మానులు సభ్యులుగానున్నారు. కాని కాంగ్రెసు సమాధానపెట్టుకొనవలసినట్టి ముసల్మానుసోదరులుగాక ఆ ముసల్మానుసోదరులలోనే అమెరీగారు చెప్పిన "అచరణసాధ్యముకానికోరికలను, కోరిన కొందరుప్రతికూలురు మాత్రమే అయియున్నారు. ఇపుడు అమెరీగారు అట్టికోరికలకు అవకాశములేదని స్పష్టముగా చెప్పినందువల్ల భారతదేశసామాజిక జాతీయతయందు తనస్థానమునుగురించి ఇంతవరకుతమకున్న అభిప్రాయములను మార్చుకొనవలెను. కాంగ్రెసువారు తమ ముసల్మానుసోదరులయెడ తమవిధినిగుర్తించి ఆముసల్మానులలో ప్రతికూలురైనవారలు తమ "అనాచరసాధ్యములైన కోరికల"ను వదలుచో అప్పుడు సమాధానమార్గమే సిద్ధించును. అని తత్ప్రభుత్వాధికారములలో కొన్నిటిని వదలుకొని, తమ రాజ్యాంగములను మొత్తము భారతదేశపు రాజకీయ జీవితానికి దాదాపు అనుగుణముగా నుండునట్లు సవరించుకొనవలసి యుండును.

"అమెరీగారు చెప్పిన అంశాలు సరియైనవే కాని భారతదేశానికి ఇపుడు కావలసినది రోగగ్రస్తమైన శరీరానికి ప్రాణశక్తినోయగల సర్జను కావలసియున్నది. తనఅధికారమును వదలుకొని భారతదేశమునకిచ్చి, అది అమెరీగారుచెప్పినట్లు "సంపూర్ణస్వాతంత్ర్యము, సంపూర్ణవికాసము, సంపూర్ణవ్యక్తిజీవిత నానాప్రకారత్వము" భారతదేశము నిజంగా అనుభవించుట తమకిష్టమేనని బ్రిటను చెప్పినచో, భారతదేశ రాజకీయ జీవితంలో ప్రాణముపోసినట్లగును."

—

## లావల్‌గారి ఉద్వాసన

ఈ మూడు రోజులలో ఫ్రాన్సునందు ఒకవిశేషము జరిగినది. ౧౪వ తేదీన ఫ్రెంచిప్రధాని మార్షల్ పెతెయిన్‌గారు "విషియన్సు" రేడియోలో ఉపన్యసించుచు లావల్‌గారు ఫ్రెంచి మంత్రివర్గమునుండి దేశక్షేమముకొఱకు తొలగించబడినట్లు చెప్పిరి. ఆస్థానమునకు ఫ్లాండిన్‌గారిని ఏర్పాటుచేసినట్లు చెప్పిరి. కాని ఫ్లాండిన్‌గారు కేవలం విదేశాంగమంత్రిగామాత్రమే ఉందురు. ఏలననగా ఉపప్రధాని పదవియే లావల్‌గారితో వదలివేయబడినది. డిసంబరు ౧౪వ తేదీనాటికే లావల్‌గారు అరెస్టు చేయబడినట్లు వార్త వచ్చినది. లావల్‌గారి ఉద్వాసన ఫ్రెంచి ప్రజలకందరికి సమ్మతమేయైనట్లు రూటరువిలేఖరి తెలుపుచున్నాడు. కాని పెతెయినుగారు అసలు ఏకారణంచే లావలును తొలగించెనో తెలియుటలేదనుచున్నాడు. లావల్‌గారు చీటికిమాటికి హిట్లరువద్దకు పోతూవస్తూఉండుట చూచి ఏదో కుట్రను ఫ్రాన్సుదేశవిరుద్ధముగ చేయుచుండెనని అనుమానమేదైన ఉండునేమో! అట్లయినపుడు లావల్ ఉద్వాసనను హిట్లరుకు పెతెయిను గారు తెలిపినపుడు హిట్లరు ఎందుకుసమ్మతించవలెను! అనుప్రశ్న ఉదయించును. బహుశా లావలును పోనిచ్చి ఫ్రాన్సుప్రజలను సంతృప్తపరచుట ప్రస్తుతసమయంలో మంచిదని హిట్లరు తలచియుండునా? పెతెయినుగారుచేసిన ప్రకటనలో ఈ మంత్రివర్గపు మార్పులవల్ల జర్మనీతో ఫ్రాన్సుకు గలసంబంధంలో ఎట్టిమార్పు గాని ఉండేదిలేదని చెప్పిరి. అందువల్ల లావల్‌గారు తాను ఫ్రాన్సు దేశప్రనియంత కగుటకై తనకనుకూలము, అనేకములైన ఆజ్ఞలుగావించుటకు కుట్రపన్ని చేసినందువల్ల తొలగించబడెనని ఒక ఊహ చేయబడుచున్నది. కాని ఏదియు నిర్ధారణగా చెప్పజాలకున్నది. ఇపుడు లావల్‌గారి స్థానంలోవచ్చిన ఫ్లాండిన్‌గారు మ్యూనిచ్ ఒడంబడిక తరువాత హిట్లరును అభినందించినట్టు ఫ్రాన్సుదేశ పూర్వప్రధానియను సంగతి గమనించదగినది. కాని ఫ్లాండిన్ ఇంగ్లీషు బాగుగా మాట్లాడగలిగినవాడై అనేక ఇంగ్లీషుమిత్రులను కలిగియున్నాడు.

—

## రూజ్వెల్టుగారితో విండ్సర్ డ్యూకు సంభాషణ

ఈ మూడురోజులలో వచ్చిన మరియొకవిశేషము అమెరికా అధ్యక్షుడగు రూజ్వెల్టుగారును బాహామాదీవులకు బ్రిటిషుప్రభుత్వముచే గవర్నరుగా నియుక్తుడైన విండ్సర్ డ్యూకుగారును డిసంబరు ౧౨వ తేదీన కారిబియన్ సముద్రములో ఎక్కడనోఒకచోట "టస్కలూసా" అనే నీ... మునపై సంభాషణలుచేసిరి. వారలు బ్రిటిషువారి వెస్టుఇండీస్ దీవులలో అమెరికాకు నౌకాశ్రయములనిచ్చే విషయమును గూర్చియు, ఇకమీద ఆదీవులసంపదను వృద్ధిచేయుటకై బ్రిటను అమెరికాలుకలిసి పనిచేసే విషయమునుగూర్చియు ముచ్చటించినట్లు విండ్సరుడ్యూకుగారు పత్రికలవారలకుచెప్పినారు. యుద్ధమువల్ల ఏర్పడియున్న పరిస్థితులనుగూర్చికూడ ఆ ముచ్చటలో ఉండెను. మొత్తముమీద విండ్సరుడ్యూకుగారు ౧౪గంటల కాలము సంభాషించినారు.

రూజ్వెల్టుగారు బాహామాదీవులను చూచుచున్నారు. ఆదీవులవద్ద ఓడలనిలుపుటకు సౌకర్యములులేనందువల్ల అక్కడ అమెరికానౌకలకు ఆశ్రయముకావలెనని కోరేవిషయం ఇప్పటికి ఆపియుంచబడునని రూజ్వెల్టుగారు తెల్పినారు.

—

## పిలిప్పైనుదీవుల రక్షణకై అమెరికాజాగ్రత్తలు

సింగపూరువద్దకూడ అమెరికా నౌకలు చేరునా?

భారతదేశానికితూర్పునఉండే ప్రాంతంలో అమెరికాజాగ్రత్తపడుచున్నట్లు స్పష్టముగా నిదర్శనములు కనిపించుచున్నవనిలండన్ "టైమ్సు" పత్రికలో వాషింగ్టన్ నుండి వచ్చిన తంతివార్తలో తెల్పబడినది. రెండుపోరాటపు విమానదళాలు పిలిప్పైను దీవులకుపంపబడును. యిందుకై స్వీడన్ చేకోరియుండబడినట్టి ౧౨౦పోరాటపువిమానాలలోనుండికొన్ని అమెరికాప్రభుత్వముచే కోరబడినవి. అమెరికాసేనలకూడ పంపబడియున్నవి. ఇపుడుఆప్రాంతములో ఉండే అమెరికానౌకలన్నీ పిలిప్పైనుదీవులవద్దనే యుంచబడును.

అమెరికాయుద్ధనౌకలు ఆస్ట్రేలియాకు గాని, సింగపూరుకుగాని పంపబడునా యని అమెరికా నౌకాశాఖ కార్యదర్శిని ప్రశ్నించగా, "ఇప్పటో" అట్టిఆలోచనలేవిగాని లేవనివారనిరి. కాని "అమెరికా పసిఫిక్ సముద్రములో క్రొత్తసైనిక, నైమానిక నౌకాశ్రయములకై యత్నించక తప్పదని మాత్రముచెప్పిరి. ఈపిలిప్పైనుదీవులు అమెరికాయొక్క శత్రువులకు చిక్కినచో పసిఫిక్ సముద్ర ప్రాంతమందలి నౌకాబలము మరియు ఆశ్రయములకు లొంగిపోగలదు కనుక, అమెరికా ఫిలిప్పైనులకై అంతశ్రద్ధవహించుచున్నది. ఒకవేళ ౧౯౪౬ సంIIలో అమెరికాకుస్వాతంత్ర్యము యివ్వబడినప్పటికిన్నీ, ఆదీవులవద్ద అమెరికా నౌకలకు ఆశ్రయమున్నంతకాలము, పసిఫిక్ సముద్రములో అమెరికానౌకలు బలముగలిగి యుండగలవని అమెరికాతలంపుగా ఉన్నట్టుగ కనబడుచున్నది.

—

## పండితనెహ్రూగారికి చీనాఅధ్యక్షునిలేఖ

అలహాబాదు, డిసంబరు ౧౭

"మీదేశంలో నాయకులు ప్రపంచపరిస్థితులను బాగా ఎరిగినవారగుటచే, ప్రస్తుతఅవసరమునుబట్టి, దౌర్జన్యపు ఆక్రమణను నిరోధించుచున్న మాభావములను గుర్తించి అందుకనుగుణముగు విధానము అనుసరింతురని నమ్ముచున్నాను"

చియాంగుషేకు

అని చీనాసేనాధిపతి,ప్రభుత్వాధ్యక్షుడుఅగు జనరలు చియాంగుకాయిషేకుగారు పండిత జవహర్లాల నెహ్రూగారికి ఒక లేఖవ్రాసిరి. ఆలేఖనుడా॥ తాయిచిటావుగారు అందజేసిరి. లేఖలోయింకను యిట్లుగలదు:

"నీవుమాతో చంగుకింగునగరమున సలాపముగా ప్రసంగించినవిషయం ఇప్పటికిని జ్ఞాపకం వచ్చుచున్నది. చీనాకు మీరాకవలన పెంపొందిన యీరెండుదేశాల ఆధ్యాత్మికసఖ్యత నాకు సర్వదా సంతృప్తిగొలుపుచుండును.

"జపాను దౌర్జన్యము నెదిరించుటలో చీనా శక్తిధైర్యములు యిరుమడించుచున్నవని చెప్పగోరెదను. ఆసియాజాతులన్నియు ఐకమత్యముతో పోరాడి జయించి ప్రపంచభావిస్థితి నిర్ణయించుట అవసరమని నేనునమ్ముచున్నాను. జపానుదురాశలు ఎక్కువగుచున్నందునను, ప్రపంచపరిస్థితులే విపరీతముగా మారిపోవుచున్నందునను మాస్వాతంత్ర్యరక్షణకై మేముముందుగ శాంతివిధ్వంసకుని శిక్షించవలసి యుండును" లేఖ చీనాభాషలో వ్రాయబడినది.

—







# సత్యాగ్రహ విశేషాలు

## క్రిస్మసు పండుగలలో సత్యాగ్రహం ఆపుదల

గాంధి మహాత్ముని సూచనలు

ఈడిసెంబరు ౨౪ తేదినుండి క్రొత్త సంవత్సరపు జనవరి ౪వ తేదివరకు క్రిస్మసుపండుగల కారణముచే సత్యాగ్రహం ఉండదని గాంధిమహాత్ముని ఆదేశమును మహాదేవదేశాయిగారు ప్రకటించినారు.

ఆదేశప్రకటనతోకూడ వారు మరియొకసంగతి తెల్పినారు సత్యాగ్రహులుగా రాగోరువారు నేరుగా గాంధిమహాత్మునివద్దకు పోక తమ రాష్ట్రీయుల కాంగ్రెసు సంఘమునకు మొదట తెల్పుకొనవలెననియు, ఆరాష్ట్రసంఘాధికారులు గాంధిమహాత్మునితో ఆలోచించి అనుమతినివ్వటం నిర్ణయించగలరనియు హెచ్చరిక చేయబడినది.

విద్యార్థుల ఉత్సాహము

అనేకులు విద్యార్థులు సత్యాగ్రహము చేయుటకు తమసంసిద్ధతను గాంధిమహాత్మునికి తెలియచేయుచున్నారట. అయితే విద్యార్థులు సాధారణంగా పెద్దవారలు ఏసత్యాగ్రహపరులకు బద్ధులైయుండవలెనో వాటికి బద్ధులగుటకు అంగీకరించుటయేగాక, విద్యను చాలించుకొనుటకు నిశ్చయించుకొని తల్లిదండ్రులయొక్కయో వారలు లేనిపక్షాన పోషకులయొక్కయో అనుమతిపొందినవారలై యుండవలెననియు, తక్కినవారు సత్యాగ్రహముచేయదలచితినని విజ్ఞాపనలు పంపుకొనరాదనియు హెచ్చరిక చేయబడినది.

హరిజనులు

అఖిలభారత నిమ్నజాతీయ సంఘ కార్యదర్శులు వ్రాసిన ఒక లేఖలో తప్పక సత్యాగ్రహము చేయవలెనని అభిలాషగల హరిజన యం. యల్. ఏ లు (అనగా శాసనసభ్యులు అసెంబ్లీసభ్యులు) మాత్రమే సత్యాగ్రహము చేయుటకు అనుమతినిచ్చినాననియు, స్వయంగా ఆలోచించుకొని శక్తిగలిగినవారలను మొదటగా ఆపివేయుటలేదనియు గాంధిమహాత్ముడు తెలియబరచినాడు.

అస్సాంరాష్ట్రస్థితి

అస్సాములో కాంగ్రెసు శాసనసభ్యులందరు జనవరి ౧౫ వ తేదిలోగా సత్యాగ్రహం చేయుదురని తెలియుచున్నది.

గాంధిగారి ఆజ్ఞప్రకారం నోటీసు ఉపసంహరించుట

దివాన్ చమనలాల్ యం. యల్. ఏ. గారు రేపు గానవతేదిని ఛెహెర్టాలో సత్యాగ్రహం చేయునట్లు అమృతసరు జిల్లా మేజిస్ట్రేటుకు నోటీసుయిచ్చినారట, మహాత్మా గాంధిగారి నుండి తిరిగి ఉత్తరువు అందేవరకు ఆగవలెనని తంతివచ్చెను, మహాత్ముని ఆజ్ఞానుసారము జిల్లా మేజస్ట్రేటుకుపంపిన నోటీసును ఉపసంహరించుకొనినట్లు సమాచారం తెలిసిరి

గాంధిజీఆమోదంలేని సత్యాగ్రహి

పాలకొండతాలూకా సిరిపురముగ్రామ శాస్త్రవ్యులు శ్రీపట్టాజగ్గారావుగారిని డిసంబరు ౧౨వ తేదిసగలు ౧౨గంటలకు పాలకొండపోలీసు సబ్‌ఇన్స్‌పెక్టరుఅరెస్టుచేసి పార్వతీపురముసబుకలెక్టరువిచారణ గావించి ౧సంవత్సరము శిక్ష విధించిరి. వీరు గాంధిమహాత్మునిచే నియమింపబడిన సత్యాగ్రహి కానట్లు తెలియుచున్నది.

## నిమ్నజాతుల విద్య

హైదరాబాదు (దక్కన్), బహిష్కృత (నిమ్న) (హరిజన) విద్యార్థులు కొందరు విద్యామంత్రి గారగు నవాబు మెహిదీయార్జంగు బహద్దరు గారివద్దకు మొన్న ఆదివారమునాడు వెళ్ళి మాట్లాడినారు—వీరికి బి. యస్. వేంకటరావుగారు నాయకత్వమువహించినారు. వీరితోపాటు డి॥ బి॥ అరవమూదు అయ్యంగారు వెళ్లిరి. వీరిమొరవెట్టుకొన్న దేమనగా:

నిమ్నజాతుల దేశానికి వెన్నెముకవంటివారు. వారికష్టంమీదనే దేశాభ్యుదయం ఆధారపడిఉంది. అందుచేత వారినిక్కి మనుష్యులనటే చూడవలెను. వారివిద్యకేవ్యాసంగాలున్నాలేవు. మొత్తముజనసంఖ్యలో అరవవంతున్నారు, వారు వృద్ధికిరానిది రాష్ట్రం కూడా వృద్ధికిరాదు

హు-ఘ-నీ, నిజాంప్రభువుగారు సిల్వర్ జూబిలీకాలంలో ఇట్లుసెలవిచ్చినారు "నా అభిప్రాయంలో ఒకరు ఎక్కువకారు ఇంకొకరు తక్కువకారు. అందరున్నూ సమానులే నిమ్నజాతులు విద్యలోను, ఆర్థికంగాను వెనుకబడియున్నారు, నాప్రజలలో వారే ఎక్కువసంఖ్యలోఉన్నందున నాప్రభుత్వం వారి విషయంలో ఎక్కువశ్రద్ధ తీసుకోవలెను"

ఈవిధంగా శ్రీప్రభువుగారున్నూ సెలవిచ్చియుండగా, అందుచేత ఈప్రకటనధులిప్పుడు ప్రభుత్వాన్ని కోరదేమనగా వారి సంఘముయొక్క విద్యాభివృద్ధికి ఈక్రింది అవసరం.

ఉచితవిద్య, ప్రదక్షిణహాయం ఉచిత ఛాత్రగృహం (Hostel) ఉద్యోగాలలో కొన్ని వీరికిమాత్రమే ప్రత్యేకించుట, నిర్బంధ ప్రాథమిక విద్య, రాత్రిపాఠశాలలు"

వీరి కోరికలనంతా ఓపికతో రెండు గంటలకాలము విద్యామంత్రిగారు వినుకొన్నారు. సానుభూతితో అభిలాషలనుగురించి ఆలోచించుతాము అని వారు సెలవిచ్చినారు.

